# కేదారేశ్వర వ్రతకల్పము

ఇంటిలో ఈశాన్య మూలలో స్థలమును శుద్ధి చేసి, అలికి, బియ్యపు పిండితోగాని, రంగుల చూర్ణములతో గాని, ముగ్గులు పెట్టి, దైవస్థాపన నిమిత్తమై ఒక పీటను వేయాలి. పీట మరీ ఎత్తుగాగాని, మరీ పల్లముగా గానీ ఉండకూడదు. పిదప ఆ పీటకు కూడా చక్కగా పసుపురాసి, కుంకుమతో బొట్టుపెట్టి, వరి పిండి (బియ్యపుపిండి) తో ముగ్గు వేయాలి. సాధారణంగా అష్టదళపద్మాన్నే వేస్తారు.

పూజ చేసేవారు తూర్పుముఖంగా కూర్చోవాలి. ఏ దైవాన్ని పూజింజబోతున్నారో ఆ దైవంయొక్క ప్రతిమనుగాని, చిత్రపటమునుగాని ఆ పీటపై ఉంచాలి. ముందుగా పసుపుతో గణపతిని తయారు చేసి (పసుపును షుమారు అంగుళం సైజులో త్రికోణ ఆకృతిలో ముద్దగాచేసి), దానికి కుంకుమ బొట్టు పెట్టి, పిదప ఒక పళ్ళెంలోగాని, క్రొత్త తుండుగుడ్డమీదగాని బియ్యం పోసి దానిపై ఒక తమలపాకునుంచి, అందు పసుపు గణపతినుంచి అగరువత్తులు వెలిగించాలి. ఇపుడు పూజకు కావలసిన వస్తువులను అమర్చుకోవాలి. దీపారాధన నైఋతి దిశలో చేయవలెను.

పూజకు కావలసిన వస్తువులు - దీపారాధన విధానము :దీపారాధన చేయుటకు కుంది (ప్రమిద) వెండిదిగాని, ఇత్తడిదిగాని, మట్టిదిగాని వాడవచ్చును. కుందిలో 3 అడ్డవత్తులు 1 కుంభ వత్తి (మధ్యలో) వేసి నూనెతో తడుపవలెను. ఇంకొక అడ్డవత్తి నూనెతో తడిపి ఏకహారతిలో (కర్పూర హారతికి వాడే వస్తువు) వేసి ముందుగా ఏకహారతిలో వేసిన వత్తిని అగ్గిపుల్లతో వెలిగించి, వెలిగించిన వత్తితో కుందిలోని1 అడ్డవత్తి 1 కుంభవత్తి వెలిగించవలెను. తర్వాత చేయి కడుక్కుని నూనె కుంది నిండావేసి పిదప ఆ కుందికి మూడు చోట్ల కుంకుమ అలంకారము చేయవలెను. తర్వాత అక్షతలు వేసి దీపారాధనను లక్ష్మీస్వరూపముగా భావించి నమస్కారము చేయవలెను. కుందిలో మిగిలిన రెండు అడ్డవత్తులు పూజా సమయంలో ధూపము చూపిన తరువాత దీపము చూపించుటకు వాడవలెను. దీపారాధనకు నువ్వులనూనెగాని, కొబ్బరినూనెగాని, ఆవునెయ్యిగాని వాడవచ్చును. మనము ఆచమనము చేసినటువంటి పంచపాత్రలోని నీళ్లు దేవుని పూజకు వినియోగించరాదు. పూజకు విడిగా ఒకగ్లాసుగాని, చెంబుగాని తీసుకొని దానిలో శుద్ధ జలమును పోసి ఆ చెంబునకు కలశారాధన చేసి ఆ నీళ్లు మాత్రమే దేవుని పూజకు ఉపయోగించవలెను.

ఇంకను పూజకు కావలసిన ముఖ్య వస్తువులు : పళ్లు, కొబ్బరికాయలు, పువ్వులు, కేదారేశ్వర స్వామి యొక్క ప్రతిమ (బొమ్మ) లేదా చిత్రపటము, ఒక పీట, ధాన్యము, కొత్త కుండ, తోరములు (తోరమనగా తెల్లని దారమును తీసుకొని పసుపు రాసుకొనవలెను.ముఖ్యముగా కేదారేశ్వర నోమునకు కావలసిన తోరములు 21 పోగులు, 21 ముళ్లు కలిగివుండవలెను), నవరత్నములు లేదా కొద్ది బంగారం (శక్తి కొలది), పట్టు వస్త్రము (పీటమీద రాశిగా పోసిన ధాన్యము దానిపై పిమ్మట యజమానులు (పూజచేసేవారు) ఈ దిగువ కేశవనామాలనుస్మరిస్తూఆచమనంచేయాలి.ఈ నామములు మొత్తం 24 కలవు.

1. 'ఓం కేశవాయ స్వాహా' అని చెప్పుకుని చేతిలో నీరు తీసుకొని లోనికి తీసుకోవాలి.
2. 'ఓం నారాయణాయ స్వాహా' అనుకుని ఒకసారి
3. 'ఓం మాధవాయ స్వాహా' అనుకుని ఒకసారి జలమును పుచ్చుకోవలెను. తరువాత
4. 'ఓం గోవిందాయ నమః' అని చేతులు కడుగుకోవాలి.
5. 'విష్ణవే నమః' అనుకుంటూనీళ్ళు త్రాగి, మధ్య వ్రేలు, బొటనవ్రేళ్లతో కళ్లు తుడుచుకోవాలి.
6. 'ఓం మధుసూదనాయ నమః' అని పై పెదవిని కుడినుంచి ఎడమకి నిమురుకోవాలి.
7. 'ఓం త్రివిక్రమాయ నమః' క్రింది పెదవిని కుడినుంచి ఎడమకి నిమురుకోవాలి.
8,9. 'ఓం వామనాయ నమః' 'ఓం శ్రీధరాయ నమః' ఈ రెండు నామాలు స్మరిస్తూ తలపై కొంచెం నీళ్లు చల్లుకోవాలి.
10. ఓం హృషీకేశాయ నమః ఎడమ చేతితో నీళ్లు చల్లాలి.
11. ఓం పద్మనాభాయ నమః పాదాలపై ఒక్కొక్క చుక్క నీరు చల్లుకోవాలి.
12. ఓం దామోదరాయ నమః శిరస్సుపై జలమును ప్రోక్షించుకోవలెను.
13. ఓం సంకర్షణాయ నమః చేతివ్రేళ్లు గిన్నెలా వుంచి గడ్డము తుడుచుకోవలెను.
14. ఓం వాసుదేవాయ నమః వ్రేళ్లతో ముక్కును వదులుగా పట్టుకోవలెను.
15,16. ఓం ప్రద్యుమ్నాయ నమః ఓం అనిరుద్ధాయ నమః నేత్రాలు తాకవలెను.
17,18. ఓం పురుషోత్తమాయ నమః ఓం అధోక్షజాయ నమః రెండు చెవులూ తాకవలెను.
19,20. ఓం నారసింహాయ నమః ఓం అచ్యుతాయ నమః బొడ్డును స్పృశించవలెను.
21. ఓం జనార్దనాయ నమః చేతివ్రేళ్లతో వక్షస్థలం, హృదయం తాకవలెను.
22. ఓం ఉపేంద్రాయ నమః చేతి కొనతో శిరస్సు తాకవలెను.

23,24. ఓం హరయే నమః ఓం శ్రీకృష్ణాయ నమః కుడి మూపురమును ఎడమ చేతితో ను, ఎడమ మూపురమును కుడిచేతి ఆచమనము చేసిన తరువాత ఆచమనము చేసి, వెంటనే సంకల్పము చెప్పుకోవలెను.

ఆచమనము అయిన తరువాత, కొంచెం నీరు చేతిలో పోసుకుని నేలపై చిలకరించుతూ ఈ శ్లోకము పఠించవలెను.

శ్లో॥ ఉత్తిష్ఠంతు భూత పిశాచాః యేతే భూమిభారకాః
యేతేషామవిరోధేన బ్రహ్మకర్మ సమారభే ॥

ప్రాణాయామమ్య : ఓం భూః - ఓం భువః ఓం సువః - ఓం మహః - ఓం జనః ఓం తపః - ఓగ్ ం సత్యం - ఓం తత్ సవితుర్వరేణ్యం భర్గోదేవస్య ధీమహీధియోయోనః ప్రచోదయాత్- ఓం ఆపోజ్యోతిరసోమృతం బ్రహ్మ భూర్భువస్సువరోం అని సంకల్పము చెప్పుకొనవలెను.

సంకల్పము : మమ ఉపాత్త సమస్త దురితక్షయ ద్వారా శ్రీ పరమేశ్వర ముద్దిశ్య శ్రీపరమేశ్వర ప్రీత్యర్థం శుభే శోభన ముహూర్తే ఆద్య బ్రహ్మణః (ఇక్కడ శ్రీ మహావిష్ణో రాజ్ఞయా అని కూడా చెప్పవచ్చు) ద్వితీయ పరార్థే శ్వేత వరాహ కల్పే వైవస్వత మన్వంతరే కలియుగే ప్రథమపాదే జంబూ ద్వీపే భరతవర్షే భరత ఖండే మేరోర్దక్షిణ దిగ్భాగే శ్రీశైలస్య ఈశాన్య ప్రదేశే (మనకు శ్రీశైలము ప్రధాన క్షేత్రము కావున మనము శ్రీశైలమునకు ఏ దిక్కున ఉన్నామో ఆ దిక్కు చెప్పుకొనవలెను), కృష్ణా గోదావర్యోః మధ్యప్రదేశే (మనంఏఏనదులకుమధ్యనఉన్నామోఆయానదులపేర్లుచెప్పుకొనవలెను), శోభన గృహే (అద్దె ఇల్లు అయినచో వసతిగృహే అనియు, సొంత ఇల్లయినచోస్వగృహే అనియు చెప్పుకొనవలెను), సమస్తదేవతా బ్రాహ్మణ హరిహర సన్నిధౌ అస్మిన్ వర్తమానే వ్యావహారిక చాంద్రమానేన .......సంవత్సరే, (ఇక్కడ తెలుగు సంవత్సరమను అంటే పూజ చేయునపుడు ఏ సంవత్సరము జరుగుచున్నదో ఆ సంవత్సరము యొక్క పేరునుచెప్పుకోవలెను),........అయనే,(సంవత్సరమునకురెండుఅయనములు-ఉత్తరాయణము, దక్షిణాయనము.జనవరి 15 మకర సంక్రమణం మొదలు జూలై 14 కర్కాటక సంక్రమణం వరకు ఉత్తరాయణము, జూలై 15 కర్కాటక సంక్రమణం నుండి మరల జనవరి 14 పెద్దపండుగ అనగా మకర సంక్రమణం వరకు దక్షిణాయనం.పూజచేయునపుడు ఏ అయనము జరుగుచున్నదో దానిని చెప్పవలెను) ...... ఋతుః, (వసంత, గ్రీష్మ, వర్ష మొ॥ ఋతువులలో పూజ సమయములో జరుగుచున్న ఋతువు పేరు)

మాసే, (చైత్ర, వైశాఖ మొ॥ పన్నెండు మాసములలో పూజ సమయములో జరుగుచున్న మాసం పేరు) .....పక్షే, (నెలకు రెండు పక్షములు పౌర్ణమికి ముందు శుక్లపక్షము, అమావాస్యకు ముందు కృష్ణపక్షములు వీటిలో పూజ జరుగుచున్న సమయమున గల పక్షము పేరు) .....తిథౌ, (ఆరోజు తిథి) ....వాసరే (ఆరోజు ఏ వారమనదీ చెప్పుకొని) శుభనక్షత్రే, శుభయోగే, శుభకరణే ఏవం గుణ విశేషణ విశిష్టాయాం శుభతిథౌ మమ ఉపాత్త సమస్త దురితక్షయద్వారా శ్రీ పరమేశ్వర ముద్దిశ్య శ్రీ పరమేశ్వర ప్రీత్యర్థం పురుషులైనచో శ్రీమాన్...... గోత్రస్య..... నామధేయః, శ్రీమత్యః, గోత్రస్య, నామధేయస్య అనియు,స్త్రీలైనచో శ్రీమతి, గోత్రవతి, నామధేయవతి, శ్రీమత్యాః, గోత్రవత్యాః, నామధేయవత్యాఃఅనియు(పూజచేయువారి గోత్రము, నామము చెప్పి) నామధేయస్యః ధర్మపత్నీ సమేతస్య (పురుషులైనచో) మమ సహకుటుంబస్య, క్షేమ స్థైర్య వీర్య విజయ అభయ ఆయురారోగ్య ఐశ్వర్యాభి వృద్ధ్యర్థం, ధర్మార్థ కామ మోక్ష ఫలపురుషార్థ సిద్ధ్యర్థం,పుత్రపౌత్రాభివృద్ధ్యర్థంసకలవిధమనోవాంఛాఫలసిద్ధ్యర్థం,శ్రీ పరమేశ్వరాదేవతా ముద్దిశ్య పరమేశ్వర దేవతా ప్రీత్యర్థం (ఏ దేవుని పూజించుచున్నామో ఆ దేవునియొక్క పేరుచెప్పుకొని)సంభవద్భిరుపచారైఃసంభవతానియమేనసంభవతాప్రకారేణయావచ్ఛ క్తి (నాకు తోచిన రీతిలో, నాకు తోచిన నియమములతో, నాకు తోచిన విధముగా, భక్తి శ్రద్ధలతో సమర్పించుకొంటున్న పూజ) ధ్యానావాహనాది షోడశోపచారపూజాం కరిష్యే. తదంగ కలశపూజాం కరిష్యే ॥ పిదప కలశారాధనను చేయవలెను.

**కలశపూజను గూర్చిన వివరణ :** వెండి, రాగి, లేక కంచు గ్లాసులు (లేదా పంచపాత్రలు) రెండింటిలో శుద్ధ జలమును తీసుకొని ఒకదానియందు ఉద్ధరిణిని, రెండవదానియందు అక్షతలు, తమలపాకు, పువ్వు ఉంచుకొనవలెను. రెండవపాత్రకు బయట మూడు వైపులా గంధమును వ్రాసి కుంకమను అద్దవలెను. ఇట్లు చేయునపుడు గ్లాసును గుండ్రముగా త్రిప్పుచూ గంధమును గాని, కుంకుమనుగాని పూయరాదు. గంధమును ఉంగరపు వేలితో పూయవలెను. కుంకుమ అక్షతలు వగైరా బొటన, మధ్య, ఉంగరపు వ్రేళ్లనుకలిపిసమర్పించవలెను.యజమానులు(ఒక్కరైతేఒకరు, దంపతులైతే ఇద్దరూను) ఆ కలశాన్ని కుడిచేతితో మూసివుంచి, ఇలా అనుకోవాలి. ఈ విధముగా కలశమును తయారుచేసి పూజను చేయునపుడు మొదటగా ఈ శ్లోకమును చదువవలెను.

మం॥ కలశస్య ముఖే విష్ణుః కంఠే రుద్రస్సమాశ్రితః
మూలే తత్ర స్థితో బ్రహ్మామధ్యేమాతృ గణాస్మృతాః ॥

ఋగ్వేదో౽థ యజుర్వేదస్సామవేదో హ్యథర్వణః
అంగైశ్చ సహితాస్సర్వే కలశాంబు సమాశ్రితాః
శ్లో॥ గంగైచ యమునేచైవ కృష్ణే, గోదావరి, సరస్వతీ, నర్మదా సింధు
కావేర్యా జలేస్మిన్ సన్నిధిం కురు ॥

ఇక్కడ ఇలా శ్లోకము ముగిసిన తరువాత ఆయాతు శ్రీ కేదారేశ్వర దేవతా (ఏ దేవుని పూజైతే చేస్తున్నామో ఆ దేవుని పేరును చెప్పవలెను) పూజార్థం మమ దురితక్షయకారకాః కలశోదకేన ఓం దేవం సంప్రోక్ష్య (కలశమందలి ఉదకమును దేవునిపై చల్లాలి), ఓం ఆత్మానం సంప్రోక్ష్య అని (ఆ నీటిని తనపై చల్లుకోవాలి) ఓం పూజా ద్రవ్యాణి సంప్రోక్ష్య (పూజాద్రవ్యములపై కూడా చల్లాలి) కలశమందలి నీటిని పై మంత్రం చదువుతూ పువ్వుతోగాని, ఆకుతోగానీ చల్లాలి.

మార్జనము : ఓం అపవిత్రః పవిత్రోవా సర్వావస్థాంగతోపివా
యస్స్మరే త్పుండరీకాక్షం సబాహ్యాభ్యంతరశ్శుచిః ॥

అని పిదప కాసిని అక్షతలు, పసుపు, గణపతిపై వేసి, ఆయనను తాకి నమస్కరించి ప్రాణప్రతిష్ఠాపన చేయవలెను. ప్రాణప్రతిష్ఠ అనగా శ్రీ మహా గణాధిపతయేనమః ప్రాణప్రతిష్ఠాపన ముహూర్తస్సుముహూర్తోస్తు తథాస్తు. తరువాత ఇలా చదువుతూ విఘ్నేశ్వరునికి నమస్కరించవలెను.

శ్లో॥ శుక్లాంబరధరం విష్ణుం శశివర్ణం చతుర్భుజమ్
ప్రసన్నవదనం ధ్యాయే త్సర్వవిఘ్నోపశాంతయే ॥
సుముఖశ్చైక దంతశ్చ కపిలో గజకర్ణకః
లంబోదరశ్చ వికటో విఘ్నరాజో వినాయకః
ధూమకేతు ర్గణాధ్యక్షః ఫాలచంద్రో గజాననః
వక్రతుండ శ్శూర్పకర్ణో హేరంబః స్కంధపూర్వజః
షోడశైతాని నామాని యఃపఠేచ్ఛృణుయాదపి
విద్యారంభే వివాహేచ ప్రవేశే నిర్గమే తథా
సంగ్రామే సర్వకార్యేషు విఘ్నస్తస్య నజాయతే ॥

పిదప షోడశోపచార పూజను చేయవలెను. షోడశోపచారములనగా ధ్యాన, ఆవాహన, ఆసనం,అర్ఘ్యం,పాద్యం,ఆచమనీయం,స్నానం,వస్త్రం, యజ్ఞోపవీతం, గంధం, పుష్పం, ధూపం, దీపం, నైవేద్యం, తాంబూలం, నమస్కార ప్రదక్షిణములు మొదలగునవి.

షోడశోపచారపూజా ప్రారంభః

ధ్యానమ్ : శ్లో॥ శూలం డమరుకంచైవ దధానం హస్తయుగ్మకే,

కేదారదేవ మీశానం ధ్యాయే త్రిపురఘాతినం

శ్రీ కేదారేశ్వరాయ నమః ధ్యాయామి - ధ్యానం సమర్పయామి అని కేదారేశ్వరుని మనస్సున ధ్యానించి నమస్కరించవలెను.

ఆవాహనం : శ్లో॥ కైలాసశిఖరే రమ్యే పార్వత్యా స్సహిత ప్రభో,

ఆగచ్ఛ దేవదేవేశ మద్భ క్త్యా చంద్రశేఖర

శ్రీ కేదారేశ్వరాయ నమః ఆవాహయామి. ఆవాహనార్థం అక్షతాం సమర్పయామి. అనగా మనస్ఫూర్తిగా దేవుని మన ఇంట్లోకి ఆహ్వానించడం. అట్లు మనస్సున స్మరిస్తూ అక్షతలు దేవునిపై వేయవలెను.

ఆసనం : శ్లో॥ సురాసుర శిరోరత్న ప్రదీపిత పదాంబుజ,

కేదారదేవ మద్దత్త మాసనం ప్రతిగృహ్యతామ్.

శ్రీ కేదారేశ్వరాయ నమః నవరత్న ఖచిత సింహాసనం సమర్పయామి. సింహాసనార్థం అక్షతాంసమర్పయామి.దేవుడుకూర్చుండుటకైమంచిబంగరుపీట వేసినట్లు అనుకుంటూ అక్షతలు వేయవలెను.

పాద్యం : శ్లో॥ గంగాధర నమస్తేస్తు త్రిలోచన వృషధ్వజ,

మౌక్తికాసన సంస్థాయ కేదారాయ నమోనమః.

శ్రీ కేదారేశ్వరాయ నమః పాదౌః పాద్యం సమర్పయామి. దేవుడు కాళ్లు కడుగుకొనుటకు నీరు ఇస్తున్నామని మనసున అనుకుంటూ పువ్వుతో పంచపాత్రలోని నీరు అదే గిన్నెలో ఉద్ధరిణెతో వదలవలెను.

అర్ఘ్యం : శ్లో॥ అర్ఘ్యం గృహాణ భగవన్భ క్త్యా దత్తం మహేశ్వరః,

ప్రయచ్ఛమే మనస్తుష్టిం భక్తానామిష్టదాయకం.

శ్రీకేదారేశ్వరాయనమః హస్తౌః అర్ఘ్యం సమర్పయామి. దేవుడు చేతులు కడుగుకొనుటకై నీళ్ళిస్తున్నామని మనసున తలుస్తూ, ఉద్ధరిణితో నీరు వేరొక గిన్నెలో వదలవలయును.

ఆచమనం : శ్లో॥ మునిభిర్నారద ప్రఖ్యై ర్నిత్యమాఖ్యాతవైభవ,

కేదారదేవ భగవన్ గృహాణాచమనం విభో. శ్రీ కేదారేశ్వరాయ నమః ఆచమనీయంసమర్పయామి.అంటూదేవుని ముఖము కడుగుకొనుటకై నీళ్ళిస్తున్నామని మనమున తలుస్తూ పైన చెప్పిన పాత్రలో ఉద్ధరిణెతో ఒకమారు నీరు వదలవలెను.

సూచన : అర్ఘ్యం, పాద్యం, ఆచమనం మొదలగు వాటికి ఉద్ధరిణెతో నీరు వేరొక పాత్రలో వదలవలెను. అరివేణంలో వదలరాదు.

మధుపర్కం : శ్లో॥ కేదారదేవ భగవన్ సర్వలోకేశ్వర ప్రభో,
మధుపర్కం ప్రదాస్యామి గృహాణత్వం శుభానన

శ్రీ కేదారేశ్వరాయ నమః మధుపర్కం సమర్పయామి అని స్వామివారికి స్నానం చేయుటకు వస్త్రమిచ్చుచున్నామని తలుస్తూ, ఈ మధుపర్కంను ఆయన ప్రతిమకు అద్దవలెను. (ప్రత్తిని పెద్దబొట్టుబిళ్ళ సైజులో గుండ్రముగా చేసి నీటిలో తడిపి ఆపైన రెండువైపులా పసుపులో అద్ది ఉంచుకొన్నదాన్ని మధుపర్కం అంటారు).

పంచామృతస్నానం : శ్లో॥ స్నానం పంచామృతైర్దేవ తతశ్శుద్ధోదకై రపి,
గృహాణ గౌరీరమణ తద్భ క్తేన మయార్పితమ్.

శ్రీ కేదారేశ్వరాయ నమః పంచామృత స్నానం సమర్పయామి అని స్నానమునకు పంచామృతములతో కూడిన నీరు ఇచ్చునట్లు భావించి ఆవునెయ్యి, ఆవుపాలు, ఆవు పెరుగు, తేనె, పంచదార కలిపిన పంచామృతమును స్వామిపై ఉద్ధరిణెతో చల్లవలెను.

శుద్ధోదకస్నానం : శ్లో॥ నదీజలం సమాయుక్తం మయాదత్త మనుత్తమం,
స్నానం స్వీకురు దేవేశ సదాశివ నమోస్తుతే.

శ్రీ కేదారేశ్వరాయ నమః శుద్ధోదకస్నానం సమర్పయామి. పంచపాత్రలోని శుద్ధ నీటిని పువ్వుతో దేవునిపై చల్లవలెను.

వస్త్రయుగ్మం : శ్లో॥ వస్త్రయుగ్మం సదాశుభ్రం మనోహర మిదం శుభం,
దదామి దేవదేవేశ భక్త్యేదం ప్రతిగృహ్యతామ్ .।

శ్రీ కేదారేశ్వరాయ నమః వస్త్రయుగ్మం సమర్పయామి అనుచు వస్త్రమును (ప్రత్తిని బొట్టు బిళ్ల ఆకారములో గుండ్రముగా చేసికొని కొద్దిగా తడిచేసి కుంకుమలో అద్దినచో అది వస్త్రమగును) స్వామివారి ప్రతిమకు అద్దవలెను.

యజ్ఞోపవీతం : శ్లో॥ స్వర్ణయజ్ఞోపవీతం చ కాంచనం చోత్తరీయకం,
రుద్రాక్షమాలయా యుక్తం దదామి స్వీకురు ప్రభో.

శ్రీ కేదారేశ్వరాయ నమః ఉపవీతం సమర్పయామి అనగా జందెమును ఇవ్వవలెను. ఇదియును ప్రత్తితో చేయవచ్చును.ప్రత్తిని తీసుకొని పసుపుచేత్తో బొటన వ్రేలు, మధ్య వ్రేలితో మధ్య మధ్య నలుపుతూ పొడవుగాచేసి,కుంకుమఅద్దవలెను.దీనినిపురుషదేవతా పూజకు మాత్రమే సమర్పించవలెను.

గంధం : శ్లో॥ సమస్త గంధ ద్రవ్యాణాం దేవత్వమసి జన్మభూః,
భక్త్యా సమర్పితం ప్రీత్యా మధుగంధాది గృహ్యతాం.

శ్రీ కేదారేశ్వరాయై నమః గంధాన్ సమర్పయామి. ముందుగా తీసిపెట్టుకున్న గంధమును కుడిచేతి ఉంగరం వ్రేలుతో స్వామివారి ప్రతిమపై చల్లవలెను.

అక్షతాన్ : శ్లో॥ అక్షతోసి స్వభావేన భక్తానా మక్షతం పదం,
దదాసి నాథ మద్దత్తై రక్ష తైః ప్రీయతాం భవాన్.

శ్రీ కేదారేశ్వరాయై నమః అక్షతాన్ సమర్పయామి. (అక్షతలకు కొద్ది బియ్యమును తడిపి పసుపువేసి కలుపవలెను) అక్షతలు తీసుకొని స్వామివారి ప్రతిమపై చల్లవలెను.

పుష్ప పూజ : శ్లో॥ కల్పవృక్ష ప్రసూనై స్త్వం పూర్వైరభ్యర్చితస్సురైః,
కుంకుమై పార్థి వై రేభి రిదానీ మర్చతాం మయా.

శ్రీ కేదారేశ్వరాయైనమఃపుష్పాణి సమర్పయామి. స్వామివారికి పువ్వులతో అలంకారము చేసి, పుష్పములతో పూజించవలెను.

తతః ఇంద్రాది లోకపాలకపూజాం కుర్యాత్
శివస్య దక్షిణేభాగే బ్రహ్మణే నమః ఉత్తరభాగే విష్ణవే నమః,
మధ్యే కేదారేశ్వరాయ నమః.

పిదప అథాంగపూజను చేయవలెను. ఈ క్రింది అథాంగపూజలోని ఒక్కొక్క నామము చదువునపుడు పువ్వులుగాని, పసుపు లేదా కుంకుమతోగాని పూజించవచ్చును.

అథ అంగపూజా

ఓం మహేశ్వరాయ నమః పాదౌ పూజయామి; ఓం ఈశ్వరాయ నమః జంఘే పూజయామి; ఓం కామరూపాయనమఃజానునీ పూజయామి;ఓం హరాయ నమః ఊరూం పూజయామి; ఓం త్రిపురాంతకాయ నమః గుహ్యం పూజయామి; ఓం భవాయ నమః కటిం పూజయామి; ఓం గంగాధరాయ నమః నాభిం పూజయామి; ఓంమహాదేవాయనమఃఉదరంపూజయామి;ఓంపశుపతయేనమఃహృదయంపూజయామి; ఓం పినాకినే నమః హస్తాన్ పూజయామి; ఓం శివాయ నమః భుజౌ పూజయామి; ఓంశితికంఠాయనమఃకంఠంపూజయామి;ఓంవిరూపాక్షాయ నమః ముఖం పూజయామి; ఓం త్రినేత్రాయ నమః నేత్రాన్ పూజయామి; ఓం రుద్రాయ నమః లలాటం పూజయామి; ఓం శర్వాయ నమః శిరః పూజయామి; ఓం చంద్రమౌళయే నమః మౌళిం పూజయామి. పశుపతయే నమః సర్వాంణ్యంగాని పూజయామి.

పిదప ఈ క్రింది 108 నామములతో కూడిన అష్టోత్తర శతనామావాళి పూజను ఒక్కొక్క మంత్రమునకుపువ్వులుగాని,పసుపుగాని,కుంకుమగానిస్వామిపైవేయుచుపూజించవలెను.

**అథాష్టోత్తర శతనామ పూజా**

ఓం శివాయ నమః ఓం కఠోరాయ నమః ఓం జగద్వ్యాపినే నమః
ఓం మహేశ్వరాయ నమః ఓం త్రిపురాంతకాయ నమః ఓం జగద్గురవే నమః
ఓం శంభవే నమః ఓం వృషాంకాయ నమః ఓం వ్యోమవేశాయ నమః
ఓం పినాకినే నమః ఓం వృషభారూఢాయ నమః40 ఓం మహాసేనజనకాయ నమః
ఓం శశిశేఖరాయ నమః ఓం భస్మోద్ధూళితవిగ్రహాయ నమః ఓం చారువిక్రమాయ నమః
ఓం వామదేవాయ నమః ఓం సామప్రియాయ నమః ఓం రుద్రాయ నమః
ఓం విరూపాక్షాయ నమః ఓం సర్వమయాయ నమః ఓం భూతపతయే నమః
ఓం కపర్దినే నమః ఓం త్రయీమూర్తయే నమః ఓం స్థాణవే నమః 80
ఓం నీలలోహితాయ నమః ఓం అనీశ్వరాయ నమః ఓం అహిర్బుధ్న్యాయ నమః
ఓం శంకరాయ నమః 10 ఓం సర్వజ్ఞాయ నమః ఓం దిగంబరాయ నమః
ఓం శూలపాణినే నమః ఓం పరమాత్మాయ నమః ఓం అష్టమూర్తయే నమః
ఓం ఖట్వాంగినే నమః ఓం సోమసూర్యాగ్నిలోచనాయ నమః ఓం అనేకాత్మాయ నమః
ఓం విష్ణువల్లభాయ నమః ఓం హవిషే నమః ఓం సాత్త్వికాయ నమః
ఓం శిపివిష్టాయ నమః ఓం యజ్ఞమయాయ నమః 50 ఓం శుద్ధవిగ్రహాయ నమః
ఓం అంబికానాథాయ నమః ఓం సోమాయ నమః ఓం శాశ్వతాయ నమః
ఓం శ్రీకంఠాయ నమః ఓం పంచవక్త్రాయ నమః ఓం ఖండపరశవే నమః
ఓం భక్తవత్సలాయ నమః ఓం సదాశివాయ నమః ఓం అజాయ నమః
ఓం భవాయ నమః ఓం విశ్వేశ్వరాయ నమః ఓం పాశవిమోచకాయ నమః 90
ఓం శర్వాయ నమః ఓం వీరభద్రాయ నమః ఓం మృడాయ నమః
ఓం త్రిలోకేశాయ నమః 20 ఓం గణనాథాయ నమః ఓం పశుపతయే నమః
ఓం శితికంఠాయ నమః ఓం ప్రజాపతయే నమః ఓం దేవాయ నమః
ఓం శివాప్రియాయ నమః ఓం హిరణ్యరేతాయ నమః ఓం మహాదేవాయ నమః
ఓం ఉగ్రాయ నమః ఓం దుర్ధర్షాయ నమః 60 ఓం అవ్యయాయ నమః
ఓం కపాలినే నమః ఓం గిరిశాయ నమః ఓం హరియే నమః
ఓం కామారినే నమః ఓం గిరీశాయ నమః ఓం పూషదంతభేత్రే నమః

ఓం గంగాధరాయ నమః ఓం భుజంగభూషణాయ నమః ఓం దక్షాధ్వరహరాయ నమః

ఓం లలాటాక్షాయ నమః ఓం భర్గాయ నమః ఓం హరాయ నమః 100

ఓం కాలకాలాయ నమః30 ఓం గిరిధ్వనినే నమః ఓం భగనేత్రభిదే నమః

ఓం కృపానిధయే నమః ఓం గిరిప్రియాయ నమః ఓం అవ్య క్తాయ నమః

ఓం భీమాయ నమః ఓం కృత్తివాసాయ నమః ఓం సహస్రాక్షాయ నమః

ఓం పరశుహస్తాయ నమః ఓం పురారాతయే నమః ఓం సహస్రపాదవే నమః

ఓం మృగపాణినే నమః ఓం భగవతే నమః ఓం అపవర్గప్రదాయ నమః

ఓం జటాధరాయ నమః ఓం ప్రమథాధిపాయ నమః 70 ఓం అనంతాయ నమః

ఓం కైలాసవాసినే నమః ఓం మృత్యుంజయాయ నమః ఓం తారకాయ నమః

ఓం కవచినే నమః ఓం సూక్ష్మతనవే నమః ఓం పరమేశ్వరాయ నమః

**అష్టోత్తర శతనామ పూజాం సమర్పయామి.**

పిమ్మట 21 ముళ్లతో తయారుచేసుకున్న తోరమును తీసికొని స్వామి వద్ద వుంచి ఈ క్రింది మంత్రములు చదువుచు పూజించవలెను.

**అథ సూత్రగ్రంథి పూజా**

ఓం శివాయ నమః ప్రథమ గ్రంథిం పూజయామి

ఓం శాంతాయ నమః ద్వితీయ గ్రంథిం పూజయామి

ఓం మహాదేవాయ నమః తృతీయ గ్రంథిం పూజయామి

ఓం వృషభధ్వజాయ నమః చతుర్థ గ్రంథిం పూజయామి

ఓం గౌరీశాయ నమః పంచమ గ్రంథిం పూజయామి

ఓం రుద్రాయ నమః షష్ఠమ గ్రంథిం పూజయామి

ఓం పశుపతయే నమః సప్తమ గ్రంథిం పూజయామి

ఓం భీమాయ నమః అష్టమ గ్రంథిం పూజయామి

ఓం త్ర్యంబకాయ నమః నవమ గ్రంథిం పూజయామి

ఓం నీలలోహితాయ నమః దశమ గ్రంథిం పూజయామి

ఓం హరాయ నమః ఏకాదశ గ్రంథిం పూజయామి

ఓం స్మరహరాయ నమః ద్వాదశ గ్రంథిం పూజయామి

ఓం భర్గాయ నమః త్రయోదశ గ్రంథిం పూజయామి

ఓం స్వయంభువే నమః చతుర్దశ గ్రంథిం పూజయామి

ఓం శర్వాయ నమః పంచదశ గ్రంథిం పూజయామి

ఓం సదాశివాయ నమః షోడశ గ్రంథిం పూజయామి

ఓం ఈశ్వరాయ నమః సప్తదశ గ్రంథిం పూజయామి

ఓం ఉగ్రాయ నమః అష్టాదశ గ్రంథిం పూజయామి

ఓం శ్రీకంఠాయ నమః ఏకోనవింశతి గ్రంథిం పూజయామి

ఓం నీలకంఠాయ నమః వింశతి గ్రంథిం పూజయామి

ఓం కేదారేశ్వరాయ నమః ఏకవింశతి గ్రంథిం పూజయామి

శ్రీ కేదారేశ్వరాయ నమః

నానావిధ పరిమళ పుష్పాణి సమర్పయామి.

పిదప అగరువత్తిని వెలిగించి......

ధూపం : శ్లో॥ దశాంగ ధూపముఖ్యంచ హ్యంగార వినివేశితం,

ధూపం సుగంధై రుత్పన్నం త్వాం ప్రీణయతు శంకర.

ఓం శ్రీ కేదారేశ్వరాయ నమః ధూప మాఘ్రాపయామి. ధూపం సమర్పయామి. అంటూ ఎడమచేత్తోగంటవాయిస్తూకుడిచేత్తోఅగరుబత్తినితిప్పుతూపొగను స్వామికి చూపవలెను.

దీపం : శ్లో॥ యోగినాం హృదయే నైవజ్ఞానదీపాం కురోహ్యసి,

బాహ్యదీపో మయాదత్తః గృహ్యతాం భక్తగౌరవాత్.

ఓం శ్రీ కేదారేశ్వరాయ నమః సాక్షాత్ దీపం దర్శయామి అని మొదట్లో చెప్పిన విధంగా దీపారాధనలో వున్న అదనపు వత్తులలో ఒకదానిని తీసుకొని హారతి వెలిగించే దాంట్లో వేసి వెలిగించి గంట మ్రోగిస్తూ ఆ దీపం స్వామికి చూపుతూ పై శ్లోకమును చదువవలెను.

నైవేద్యం : శ్లో॥ త్రైలోక్యమపి నైవేద్యం న తే తృప్తిస్తథా బహిః

నైవేద్యం భక్తవాత్సల్యాద్గృహ్యతాం త్ర్యంబకంత్వయా.

ఒక బెల్లం ముక్క, పళ్ళు, కొబ్బరికాయ మొదలగునవి స్వామివద్దనుంచి దానిపై పువ్వుతో నీళ్లు చల్లుతూ ఎడమచేత్తో గంటవాయిస్తూ ఓం శ్రీ మహాగణాధిపతయేనమః గుడ శకల నైవేద్యం సమర్పయామి. 'ఓం ప్రాణాయ స్వాహా, ఓం అపానాయస్వాహా, ఓం వ్యానాయస్వాహా, ఓం ఉదానాయ స్వాహా, ఓం సమానాయ స్వాహా, ఓం శ్రీమహాగణాధిపతయే నమః'అంటూ ఆరుమార్లు చేతితో (చేతిలోని ఉద్ధరిణెతో) స్వామికి నివేదనం చూపించాలి. పిదప ఓం శ్రీ కేదారేశ్వరాయ నమః నైవేద్యానంతరం 'హస్తౌ ప్రక్షాళయామి'అని ఉద్ధరిణెతో పంచపాత్రలోని నీరు ముందు చెప్పిన అర్ఘ్యపాత్ర (పంచపాత్ర కాకుండా విడిగా చెంబులో పెట్టుకొనే నీళ్ల పాత్ర) లో వదలాలి.

తరువాత 'పాదౌ ప్రక్షాళయామి' అని మరోసారి నీరు అర్ఘ్య పాత్రలో ఉద్ధరిణెతో వదలాలి. పునఃశుద్ధాచమనీయంసమర్పయామిఅనిఇంకొకపర్యాయం నీరు వదలాలి తదనంతరం.

తాంబూలం : శ్లో॥ నిత్యానందస్వరూపస్త్వం యోగిహృత్కమలే స్థితః,
గృహాణభక్త్యా మద్దత్తం తాంబూలం ప్రతిగృహ్యతాం.

అని చెబుతూ మూడు తమలపాకులు, రెండు పోకచెక్కలు వేసి స్వామివద్ద ఉంచాలి. తాంబూలం వేసుకున్నాక నోరు కడుక్కొనుటకు నీరు ఇస్తున్నామని తలుస్తూ, 'తాంబూల చరవణానంతరం శుద్ధ ఆచమనీయం సమర్పయామి'అంటూ ఉద్ధరిణెతో నీరు అర్ఘ్యపాత్రలో వదలాలి. పిమ్మట కర్పూరం వెలిగించి......

పునరర్ఘ్యం : శ్లో॥ అర్ఘ్యం గృహాణ భగవన్ భక్త్యాదత్తం మహేశ్వర,
ప్రయచ్ఛ మే మనస్తుష్టిం భక్తానా మిష్టదాయకం.

కేదారేశ్వరాయనమఃపునరర్ఘ్యంసమర్పయామి. మరల దేవుడు చేతులు కడుగుకొనుటకై నీళ్ళిస్తున్నామని మనసున తలుస్తూ, ఉద్ధరిణితో నీరు వేరొక గిన్నెలో వదలవలయును.

నీరాజనం : శ్లో॥ కర్పూరం చంద్రసంకాశం జ్యోతిస్సూర్యమివోదితం
భక్త్యా దాస్యామి కర్పూర నీరాజన మిదం శివ.

ఓం శ్రీ కేదారేశ్వరాయ నమః నీరాజనం సమర్పయామి అని కర్పూర బిళ్ళలు హారతి కుందిలో వేసి ముందుగా దీపారాధనకు వెలిగించిన దీపంతో వెలిగించి, మూడుమార్లు త్రిప్పుచూ, చిన్నగా గంట వాయించవలెను. అనంతరం మళ్లీ పువ్వుతో నీరు హారతి కుంది చివర వదులుతూ 'కర్పూర నీరాజనానంతరం శుద్ధాచమనీయం సమర్పయామి ' అని చెప్పి నీరాజనం స్వామివారికి చూపించి తరువాత ఇంటిలోని వారందరూ హారతిని కళ్ళకు అద్దుకోవాలి. తరువాత అక్షతలు, పువ్వులు, చిల్లర డబ్బులు చేతితో పట్టుకొని,

ప్రదక్షిణం : శ్లో॥ భూతేశ భువనాధీశ సర్వదేవాదిపూజిత,
ప్రదక్షిణం కరోమి త్వాం వ్రతం మే సఫలం కురు.

ఓం శ్రీ కేదారేశ్వరాయ నమః ఆత్మ ప్రదక్షిణ నమస్కారాన్ సమర్పయామి. శ్రీ స్వామికి చేతిలో అక్షతలు, పువ్వులు తీసుకొని లేచి నిలబడి మూడు సార్లు ఆత్మప్రదక్షిణ చేసి (అనగా తమలో తాము చుట్టూ తిరిగి) పిమ్మట సాష్టాంగ నమస్కారం చేసి (మగవారు పూర్తిగా పడుకుని తలను నేలకు ఆన్చి, ఆడువారు మోకాళ్లపై పడుకుని కుడికాలు ఎడమకాలుపై వేసి) తరువాత స్వామిపై చేతిలోనున్న అక్షతలు, పువ్వులు చల్లి మరల తమ స్థానమున ఆసీనులై నమస్కరించుచూ ....

నమస్కారాన్ : శ్లో॥ హరః శంభో మహాదేవ విశ్వేశామర వల్లభ,
శివ శంకర సర్వాత్మన్ నీలకంఠ నమోస్తుతే.
ఓం శ్రీ కేదారేశ్వరాయ నమః నమస్కారాన్ సమర్పయామి అని మనస్ఫూర్తిగా స్వామికి నమస్కరించవలెను.
ప్రార్థన : శ్లో॥ అభీష్టసిద్ధిం కరు మే శివావ్యయ మహేశ్వర,
భక్తానాం వరదానార్థం మూర్తీకృత కళేబర.
ఓం శ్రీ కేదారేశ్వరాయ నమః ప్రార్థయామి అని స్వామిని ప్రార్థించవలెను.
సూత్రగ్రహణం : శ్లో॥ కేదార దేవదేవేశ భగవ న్నంబికాపతే,
ఏకవింశ ద్దినేతస్మిన్ సూత్రం గృహ్ణామ్యహం ప్రభో.
ఓం శ్రీ కేదారేశ్వరాయ నమః సూత్రగ్రహణం కరిష్యే అని స్వామివద్ద వుంచి పూజించిన తోరములను చేతిలోనికి తీసుకొని పై శ్లోకమును చదువుకొనవలెను.
తోరబంధన మంత్రం : శ్లో॥ ఆయుశ్చ విద్యాంచ తథా సుఖం చ
సౌభాగ్యవృద్ధిం కురు దేవదేవ.
సంసార ఘోరాంబునిధౌ నిమగ్నం
మాం రక్ష కేదార నమో నమస్తే.
ఓం శ్రీ కేదారేశ్వరాయ నమః తోరబంధనం కరిష్యే అని స్వామిని స్మరించి తోరమును దక్షిణ హస్తమున (కుడిచేతికి) కట్టుకొనవలెను.
వాయనదానం : శ్లో॥ కేదారః ప్రతిగృహ్ణాతు కేదారో వైదదాతి చ,
కేదారస్తారకోభాభ్యాం కేదారాయ నమోనమః.
ఓం శ్రీ కేదారేశ్వరాయ నమః వాయనదానం కరిష్యామి అని స్వామికి నైవేద్యము చేసిన పదార్థములతోపాటు దక్షిణ తాంబూలములను బ్రాహ్మణునికి వాయనమివ్వవలెను.
ప్రతిమాదానం : శ్లో॥ కేదారః ప్రతిమాం యస్మాద్రాజ్యం సౌభాగ్యవర్ధినీ,
తస్మాదస్యాః ప్రదానేన మాస్తు శ్రీరచంచలా.
ఓం శ్రీ కేదారేశ్వరాయ నమః ప్రతిమాదానం కరిష్యామి అని పూజకు తీసుకొన్న స్వామియొక్కప్రతిమను(బొమ్మ)దక్షిణతాంబూలములతోబ్రాహ్మణునకు దానమీయవలెను.
ఇతి పూజావిధానం సంపూర్ణమ్.

కేదారేశ్వర వ్రతకథా ప్రారంభము

సూతపౌరాణికుండు శౌనకుడు మొదలగు మహర్షులను చూచి ఈవిధంగా పలికెను. ఋషి పుంగవులారా! మానవులకు సర్వసౌభాగ్యములను కలుగచేయునదియు, పార్వతీదేవిచే సాంబశివునిశరీరార్థము(శరీరములోసగము)పొందినదియునగు కేదారేశ్వర వ్రతము అను ఒక వ్రతము కలదు. ఆ వ్రతవిధానమును వివరించెదను వినండి. దీనిని బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్రులు అందరును ఆచరించవచ్చును. ఈ వ్రతమును ఇరువదియొక్క మారులాచరించువారు (ఇరవైయొక్క సార్లు) సకల సంపదలనుభవించి పిదప శివసాయుజ్యము (కైలాస ప్రాప్తి) పొందుదురు.

ఓ మునిశ్రేష్ఠులారా! ఈ వ్రతమాహాత్మ్యమును (వ్రతము యొక్క గొప్పతనమును) వివరించెదను వినుము. భూలోకమునందు ఈశాన్యభాగమున మెఱుపు గుంపులతో కూడియున్న శరత్కాల మేఘములను పోలిన నిఖిలమణి విచిత్రంబైన శిఖరములచేతను, అనేక రకములైన పువ్వుల తీగలతోను, అనేకరకములైన పుష్ప ఫలాదులచేతను, నానావిధములైనపక్షులచేతనుమరియు అనేకములైన కొండకాలువల చేతను భాసిల్లునట్టి (ప్రకాశించునట్టి)ఉద్యానవనములచేతనిఖిలకల్యాణప్రదంబై జనులందరిచేత కైలాసమని పిలువబడినఒకపర్వతశ్రేష్ఠముకలదు.అంతషడ్గుణైశ్వర్యసంపన్నులును,మహనీయులగు యోగులచేతను,సిద్ధగంధర్వకిన్నరకింపురుషాదులచేతనుసేవింపబడి,మనోహరమైయున్న ఆపర్వతశిఖరమునందుజగత్కర్తయైనపరమేశ్వరుడుప్రమథగణములచేపరివేష్టించబడి (ప్రమథగణములందరు కొలువైయుండగా) భవానీ సమేతుండై (పార్వతితో కలిసి) దేవమునిబృందములచేతనమస్కరింపబడుచుప్రసన్నుడై కూర్చుండి ఒక సమయమున చతుర్ముఖాది దేవతల కందరికి దర్శనమిచ్చెను.అంత సూర్యుడు, అగ్ని,వాయుదేవుడు, నక్షత్రములతో కూడిన చంద్రుడును మరియు ఇంద్రుడు మొదలగు దేవతలు, వసిష్ఠుడు మొదలగు ఋషులు, రంభ మొదలగు అప్సరసలు, గణపతియు, సేనానియు, నంది, భృంగి మొదలగు ప్రమథగణములుకొలుచుచుండగా ఆ అద్భుతమైన సభయందు నారదుడుమొదలగుదేవగాయకులుస్వామిఅనుజ్ఞతో గానముచేశారు.అటువంటి అందమైనశ్రావ్యమైనగానము చేయుచుండగా మేనక మొదలయినవారు నృత్యము చేసిరి.అప్పుడుఅందరిలోమిక్కిలిసొగసుతోకూడినరంభఅందరిమనసులు సంతోషపడునట్లుగా నాట్యము చేసెను. అప్పుడు భృంగిరిటి అను భక్తుడు ఆ స్వామి సన్నిధియందు నాట్యము చేయగా సకల దేవతలకు మిక్కిలి హాస్యము జనించెను. అటువంటిఆశ్చర్యంబగుహాసములవలనపర్వతగుహలునిండునట్లుకలకలధ్వని కలిగెను.

అప్పుడు శంకరుడు ఆ భృంగిరిటి నాట్యము చూచి ఆనందము చెంది ఆ భక్తుని అనుగ్రహించెను. అంతట భృంగిరిటి శివానుగ్రహము కలుగుటచేత మిక్కిలి ప్రీతి చెంది పార్వతిని వదిలి పరమేశ్వరునకు మాత్రము ప్రదక్షిణమొనర్చెను. ఇది చూచి పార్వతి ఓ స్వామీ!ఈ భృంగిరిటినన్నువదలి మీకు మాత్రమే ప్రదక్షిణము చేయుటకు కారణమేమి అని ప్రశ్నించగా ఈశ్వరుడు ఓ దేవీ! నీవలన పరమార్థ విదులగు యోగులకు ప్రయోజనము లేదని ఆతడు నాకు మాత్రమే నమస్కరించెనని చెప్పెను.ఆ మాటలకు పార్వతీదేవి మిగుల కోపించి భర్తయందున్న తన శక్తిని ఆకర్షించగా ఆ స్వామి శక్తిలేని కేవలం అర్థశరీరము కలవాడయ్యెను. అంత ఆ దేవి కూడ శక్తి లేనిదై వికటమైన రూపము కలదిగా మారెను. పిదప ఆ దేవి కోపించి దేవతలచేత ఊరడింపబడినదైనను కైలాసమును వదలి తపస్సు చేసుకొనుటకు అనేక రకములైన మృగములచే సేవింపబడునది, అనేక రకముల చెట్లు, మొక్కలతోను, ఋషి శ్రేష్ఠులతోను కూడిన గౌతమాశ్రమమును ప్రవేశించెను.అంత ఆ గౌతముడు ఆశ్రమమున ప్రవేశించి తామర రేకులవంటికన్నులు కలిగి అలంకృతురాలై యున్న మహేశ్వరిని కనుగొని పూజ్యురాలైన ఓ భగవతీ ! నీవు ఇచ్చటకు వచ్చుటకు కారణమేమి? అని అడుగగా ఆ దేవి గౌతముని చూచి తన విషాదమునకు కారణమును చెప్పి నమస్కరించి, ఓ మునీశ్వరా! ఏ వ్రతము యోగులకు సమ్మతమైనదో, ఏ వ్రతము చేత శంకరుని దేహములో అర్థము తిరిగి తనకు ప్రాప్తించునో అటువంటి వ్రతమును నాకు ఉపదేశింపుమని అడుగగా ఆ మహర్షి సకల శాస్త్రపురాణాలలోనుఇష్టముగాఆచరించునటువంటిదైనకేదారేశ్వరవ్రతమునుఆచరింపుమని ఉపదేశించగా,ఆదేవి ఆ వ్రతమును ఆచరించుటెట్లో సెలవీయవలసినదిగా కోరెను.

అమ్మా! భాద్రపద శుక్లాష్టమియందు శుద్ధమనస్కురాలవై మంగళకరములగు ఏకవింశతి తంతువులచేత (21 వరుసల దారమును పసుపు రాసి తోరముగా తయారుచేసుకొని) హస్తమునందు ధరించి, పూజించి, ఆ దినమందు ఉపవాసమొనరించి, మరునాడు భోజనము చేయించి, అది మొదలు అమావాస్య వరకు ఈ వ్రతమునిట్లు చేయుచు ప్రతిదినము శ్రీ కేదారదేవుని ఆరాధింపవలయును. ఇంటియందు శుభ్రమైన ఒక ప్రదేశమునధాన్యరాశిలోపూర్ణకుంభమునుఉంచి,ఇరువదియొక్కసూత్రముల(దారముల) చేత చుట్టి, పట్టువస్త్రములచే కప్పి, నవరత్నములుగాని, శక్తికొలది బంగారంకాని ఉంచి గంధపుష్పాక్షతలచే పూజించి ఇరువదియొక్కమంది బ్రాహ్మణులను పిలిపించి పాదప్రక్షాళనాది కృత్యములు ఆచరించి (కాళ్లు చేతులు కడిగించి) కూర్చొనపెట్టి అచ్చట ఆ కేదారదేవుని వుంచి, చందన (గంధం), ధూప, కుంకుమ,

అన్నిరకాలపువ్వులతోపూజించితాంబూలవస్త్రములుంచి, 21 రకముల పిండివంటలతో, పళ్లు, కొబ్బరికాయ మొ॥గు వాటితో నైవేద్యం పెట్టి, చక్కగా స్తోత్రము చేసి, బ్రాహ్మణులకు యథాశక్తి దక్షిణలిచ్చి ఈశ్వరునికి మనస్సును సంతుష్టి చేసినయెడల నీవు కోరిన వరములియ్యగలడు అని చెప్పగా ఆ కాత్యాయని అటులే ఆచరించెను.

అంత పరమశివుడు సంతుష్టుడై దేవగణములతో అచ్చటికి వచ్చి నా శరీరములో అర్థభాగము నీకు ఇచ్చెదనని ఇవ్వగా, పార్వతీదేవి మిక్కిలి సంతోషించి ఈ వ్రతము ఆచరించువారలకు సకల అభీష్టములు (అన్ని కోరికలు) తీరునట్లు అనుగ్రహించినచో అందరును ఈ వ్రతమును ఆచరింతురని శంకరునికి చెప్పగా శివుడు అటులే యగుగాక అని అంగీకరించి అదృశ్యమయ్యెను. కొంతకాలమునకు శివభక్తి కల చిత్రాంగదుడను గంధర్వుడునందికేశ్వరుని వలన ఆ వ్రతవిధానమును తెలుసుకొని మనుష్యలోకమునకు పోయి వారికి చెప్పవలెనను కోరికతో ఉజ్జయినీ పట్టణమును చేరి వజ్రదంతుడను రాజునకు ఆ వ్రతమును ఉపదేశించగా అతడు ఆ వ్రతము యథావిధిగా ఆచరించి సార్వభౌముడయ్యెను. మరికొంత కాలమునకు ఆ పట్టణమున ఉన్న వైశ్యునకు పుణ్యవతియు, భాగ్యవతియు అను ఇద్దరు కుమార్తెలు కలిగిరి. వారిద్దరును తండ్రి దగ్గరకు పోయి కేదార వ్రతమాచరించుటకు ఆనతీయుమని అడుగగా అతడు, అమ్మా! నేనుమిగుల దరిద్రుడను, మీరు ఆ ఆలోచననుమానుడు అనగా ఓ తండ్రీ! నీ అనుజ్ఞయే (అంగీకారమే)మాకుపరమధనముకావున ఆనతీయుమని అచ్చటనుండి ఒక వటవృక్షము (మర్రిచెట్టు) వద్ద కూర్చుండి తోరము కట్టుకొని యథావిధిగా పూజింపగా వారి భక్తికి మెచ్చి ఈశ్వరుడు పూజకు కావలసిన సామగ్రి అచ్చట వారికి సమకూరునట్లుగా చేసెను.

అంతట వారలు చక్కగా వ్రతము చేసికొనుటవలన ఆ మహాదేవుండు సంతుష్టుడై (గొప్ప సంతృప్తిని పొంది) ఆ కన్యలకు ఆయురారోగ్య ఐశ్వర్యములు, దివ్య రూపములు ఇచ్చిఅంతర్థానమయ్యెను.ఆవ్రతముయొక్క మాహాత్మ్యము వలన వైశ్యుని కుమార్తెలను ఉజ్జయినీ పట్టణమును ఏలుచున్న (పాలించుచున్న) రాజు పుణ్యవతియను కన్యను, చోళ భూపాలుడు భాగ్యవతియను కన్యను పెండ్లి చేసికొనిరి. అందువలన ఆ వైశ్యుడు ధనసమృద్ధి కలిగి సామ్రాజ్య సంపదలను, పుత్రులను పొంది సుఖముగా వుండిరి. కొన్ని రోజుల తరువాత రెండవదైన భాగ్యవతి ఐశ్వర్య మదమోహితురాలై (డబ్బుమీది ప్రేమతో) కొంతకాలమునకు ఆ వ్రతమును విడిచెను. అందువలన దరిద్రురాలై పుత్రునితోడను, భర్తతోడను అడవిలో తిరుగుతూ ఒక బోయవాని యిల్లు చేరెను. అచ్చట తన కుమారునితో నా అక్క పుణ్యవతిని ఉజ్జయినీ రాజు వివాహమాడి యున్నాడు.

అంతట వారలు చక్కగా వ్రతము చేసికొనుటవలన ఆ మహాదేవుండు సంతుష్టుడై (గొప్ప సంతృప్తిని పొంది) ఆ కన్యలకు ఆయురారోగ్య ఐశ్వర్యములు, దివ్య రూపములు ఇచ్చి అంతర్థానమయ్యెను.ఆ వ్రతముయొక్కమాహాత్మ్యమువలన వైశ్యుని కుమార్తెలను ఉజ్జయినీ పట్టణమును ఏలుచున్న (పాలించుచున్న) రాజు పుణ్యవతియను కన్యను, చోళ భూపాలుడు భాగ్యవతియను కన్యను పెండ్లి చేసికొనిరి. అందువలన ఆ వైశ్యుడు ధనసమృద్ధి కలిగి సామ్రాజ్య సంపదలను, పుత్రులను పొంది సుఖముగా వుండిరి.

కొన్ని రోజుల తరువాత రెండవదైన భాగ్యవతి ఐశ్వర్య మదమోహితురాలై (డబ్బుమీది ప్రేమతో) కొంతకాలమునకు ఆ వ్రతమును విడిచెను. అందువలన దరిద్రురాలై పుత్రునితోడను, భర్తతోడను అడవిలో తిరుగుతూ ఒక బోయవాని యిల్లు చేరెను. అచ్చట తన కుమారునితో నా అక్క పుణ్యవతిని ఉజ్జయినీ రాజు వివాహమాడి యున్నాడు. నీవు అక్కడకు పోయి మన సంగతి తెలిపి బ్రతుకు తెరువునకై తగిన ధనము తీసికొని త్వరగా రమ్ము అనగా అతడు ఆ పట్టణమునకు పోయి పెద్ద తల్లితో తమ కష్టమును తెలుపగా ఆ పుణ్యవతి అతని చేతికి ఎక్కువ డబ్బును ఇచ్చెను. అంత అతడు ఆ ధనమును తీసికొని వచ్చుచుండగా, మార్గంలో దేవుని మహిమచే ఆ డబ్బు దొంగిలించబడగా అతడు మరల పెదతల్లి దగ్గరకు వెళ్లి జరిగిన సంగతిని తెలుపగా ఆమె మరికొంతధనమునుఇచ్చెను.ఆధనముకూడాదొంగిలించబడగాదిక్కుతోచకనిలబడియున్న ఆ కుమారునితో ఈశ్వరుడు అదృశ్య రూపుడై ఓ చిన్నవాడా! వ్రత భ్రష్టులకు (వ్రతమునాచరించనివారికి) ఈ ధనము చెందదని చెప్పగా అతడు మరల పెదతల్లి వద్దకు పోయి జరిగినది తెలుపగా ఆమె ఆలోచించి ఆ కుమారునిచే కేదారేశ్వర వ్రతమును ఆచరింపజేసి, తన చెల్లెలు కూడా ఆ వ్రతమును ఆచరించునట్లు చెప్పవలసినదిగా చెప్పుమని అతనికి ధనమును ఇచ్చి పంపెను. అతడు బయలుదేరి వెడుతుండగా అనుకోని విధముగా ముందు పోయిన ధనమంతయు కూడ దొరికినందున అతి సంతోషముతో అతడు కాంచీపట్టణము ప్రవేశించుచుండగా చతురంగ బలములతో అతని తండ్రి ఎదురువచ్చి ఆ బాలునీ, అతని తల్లినీ కూడా వెంటబెట్టుకొని తన పట్టణమునకు వెళ్ళెను. అంతట ఆ రాజకుమారుడు తల్లిదండ్రులతో సుఖముగా ఉండెను. పిమ్మట తల్లియగు భాగ్యవతియు, తండ్రియగు చోళరాజును అది మొదలు ఈ వ్రతమును ఆచరించుచు సకల సంపదలనుభవించుచు సుఖముగానుండిరి.

ఏతత్ఫలం శ్రీ ....ర్పణమస్తు అంటూ అక్షతలు నీటితోపాటు అరవేణంలో వదలవలెను. పిమ్మట ' శ్రీ ..... ప్రసాదం శిరసాగృహ్ణామి ' అనుకొని స్వామివద్ద అక్షతలు తీసుకొని తమ తమ తలలపై వేసుకొనవలెను. ఆ పిదప పసుపు గణపతి ఉన్న పళ్లెము నొకసారి పైకి ఎత్తి తిరిగి క్రింద ఉంచి పళ్లెములో ఉన్న పసుపు గణపతిని తీసి దేవుని పీఠముపై నుంచవలెను. దీనిని ఉద్వాసన చెప్పటం అంటారు.

ఓం శ్రీ .............. నమః యథాస్థానం ప్రవేశయామి. శోభనార్థం పునరాగమనాయచ అని ఉద్వాసన పలుకుతారు.

శ్లో॥ యస్య స్మృత్యాచ నామోక్త్యాతపః పూజాక్రియాదిషు. న్యూనం సంపూర్ణతాం యాతి సద్యో వందేతమచ్యుతం మంత్రహీనం క్రియాహీనం భక్తిహీనం జనార్ధన, యత్పూజితం మయా దేవ పరిపూర్ణం తదస్తుతే, అనయా ధ్యాన ఆవాహనాది షోడశోపచార పూజాయా చ భగవాన్సర్వాత్మకః శ్రీ ...........దేవతా సుప్రీతోవరదోభవతు, శ్రీ............ ప్రసాదం శిరసాగృహ్ణామి.